# కల్హారమాల

పులివర్తి శరభాచార్యులు B. A. B. ED.

జూనియర్ డిప్యూటి ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు,

కొవ్వూరు.



ప్రథమ పుష్పము

ప్రకాశకులు :

విశ్వజ్ఞమండలి, తెనాలి.

# సమర్పణము

అంతము లేని చీకటి గుయారపు గోసలు మా యెడంద లో
క్కొంత వెలుఁగు వెల్లి వెలయించుటకై వెలలేని మేల్ వయ
స్సంతయు ధారవోసిన మహాత్ముఁ డితండొక కర్మయోగి యం
చెంతుమొ; ఇష్ట దైవమని యే హృదయాలయ మందుఁ గొల్తుమో!

క్రమబద్ధ ఋక్తంత్రు లమరియుండిన వీని
వీణాగళమ్ము శబ్దింప సాగి,
కాలమాచిన పురాఖండ శిల్పజ్యోతి
ఈ కరాలయములో నిను మడించి
ధీ ప్రయాగమున జ్యోతిర్వాస్తు దర్శన
జ్ఞాన త్రివేణులు సంగమించి
కరమల్లిన మధుర కావ్య ప్రసవమాల
భారతీగళ పరిష్వంగ మొనసి

ఇన్ని వ్యుత్పత్త్యుపజ్ఞల ఈశ్వరాంశ
తళుకు తళుకని మెఱసి కన్నులకు నేఁటి
కొక మహా భూతియోగ మట్లారగి చన్న
శ్రీ నిరంజను సుయశశ్శరీరమునకు—
ఈ గురుని చరణపీఠి
శ్రీ గంధపుఁ బేడుసోఁకి చేకురిన కళా
యోగమున భక్తి సేవన
గాఁ గృతి 'కల్హారమాల' కానుక పూజల్.



శ్రీ నిరంజనశాస్త్రి

# ఆశయము

ఆంధ్రవాఙ్మయము అసంపూర్ణమని పెక్కురు సారస్వతాచార్యుల తలంపు. ఇది నిక్కమే. సంస్కృతాంగ్లసారస్వతములలో వలె యిందు శాస్త్రీయ చారిత్రకాద్యనేక గ్రంథములు రచితము కాలేదు. కేవలము సాహిత్యభాగమును బట్టి చూచినను వంగవాఙ్మయములో వలెఁ దెలుఁగుఁ దోఁటలో నవరసకముల పూలు లేవు. దేశభాషలలో ఆధునిక సారస్వతీ స్వరూపమును సుపరిష్కృతము చేసికొన్న వారిలో వంగీయు లగ్రగణ్యులని మన భాషోపాసకు లనుచున్నారు. కావచ్చును, మఱి యొక్క రవీంద్రుఁడు లేఁడు; ద్విజేంద్రుఁడు లేఁడు; బంకించంద్రుఁడు లేఁడు. అనువాదములు గాని స్వతస్సిద్ధములు గాని మన కలంతియు. ఈ లోపమును పూర్తి చేయుటకే "విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి" వంటి సంస్థలు శ్రమించినవి. ఓపిన కొలఁది వాఙ్మయసేవ గావించుటను గూర్చి కొంతవఱకుఁ గృతకృత్యత నందియుఁ బ్రస్తుత మాచరణ రంగమునుండి తొలఁగినవి.

ఆంధ్ర సాహిత్యమైనను అనువాదములగు పురాణేతిహాసములను వీడిఁ గేవలము నాయికా నాయకుల శృంగారములను వర్ణించినదో, పురాణ పురుషుల అతిమానుష చరిత్రల నుద్ఘాటించినదో, పరమపురుషకైంకర్యమునకై దోసిలొగ్గి, రాజరాజుల అభీష్టములను నెఱవేర్చుటకే నీతిమాలినములగు బూతుల బుంగలను తయారొనర్చినదో, తన ధన్యమన్యతను బ్రకటించుచున్నది గాని, చరిత్రోదయమునాఁటి యుద్ధరంగములను, దేశోన్నతికి హేతుభూతము లయిన మహాపురుషుల ఇతివృత్తములను వర్ణింపఁ బూనుకొన లేదని చెప్పక తప్పదు. పూనుకొన్నను పలుతరగతులకుఁ జెందిన మానవజీవిత వృత్తములను వర్ణించు కావ్యములు అఱుదుగనే యున్నవి. కర్షక జీవితము, కార్మికుల దైన్యేతివృత్తములు, హరిజనులు మున్నగు వారిపై జరిగిన యన్యాయములను ప్రతిబింబింపఁజేయు కావ్యకోటి మృగ్యముకదా! ఇప్పుడిప్పుడు "కృషీవలుఁడు, క్షేత్రలక్ష్మి, గబ్బిలము" వంటి కృతులు వెలువడి పైని చెప్పిన లోపమును బూరింపఁ దొరకొనుచున్నవి. ఇందుకు మా సంతసమును వెలిబుచ్చు

చున్నాము. మఱియు ఆదర్శప్రాయు లయ్యు ధన సంఘ సారస్వత బలములు గల యుద్ధతజాతుల త్రొక్కుళ్ళకు నలిగిపోయిన మహాదర్శజీవులు పెక్కురు సారస్వతాధ్యాయమున కెక్కలేదు.

ఇదేమి కర్మమోగాని, భారతీయశిల్పకళాభివ్యక్తికి హేతుభూతుఁడై హైందవ నాగరికతకు వెన్నెముకయై మధ్యకాలమున అసూయాహేయము లైన స్వార్థపరజాతుల అన్యాయాక్రమణములకు లోనై యుగయుగముల నుండియు "ఆత్మదేశోన్నత్య మాత్మాభ్యుదయ" మని భారతమాతృ సేవకే తన జీవిత సర్వస్వమును వ్యయించిన శిల్పాచార్యుఁ డొక్క కవి హృదయమునకును గోచరింపకున్నాఁడు. ఏమి కారణము? శిల్పాంగ రాజ్యాంగములకును బడ్డ తగవా? ఆచార్యపురుషుల యతిలోక గౌరవమును జూచి సహింపలేక సారస్వతేయులు పన్నిన కుట్రయా? రెండును నయినట్లు కొన్ని జాడలు గోచరించు చున్నవి. రాజ్యాంగ నిర్వహణమునకు శిల్పాంగమును బడవేసి, మంత్రాంగమును మాత్రము ప్రముఖ సాధనముగాఁ జేసికొన్నచో, రాజశిఖామణుల వశము చేసికొనుట, వారి బలమున శిల్పవిభుల యౌన్నత్యము నడంచుట, సుకరమని తలంపఁబడిన దురదృష్టకాలములో శిల్పి దూరీకృతుఁ డైపోయినాఁడు. సర్వవ్యవహారములును మంత్రుల భుజస్కంధములపై మోపి కేళీకథావినోదములలో సుఖసుప్తుఁడైన ఱేఁడీ దుర్మంత్రము నెఱుంగ లేక పోయినాఁడు. స్వార్థపరుల యాటలు సాగినవి. శిల్పిని లోకము విస్మరించినది. ఇఁక నాతఁడు చేయున దేమి? స్వచ్ఛమైన యాత్మచరిత్రము పైఁ గూడఁ గళంకములు వ్రాసిన లేఖినిని సైత మాతఁ డడ్డుకొనుట కవకాశము చిక్కనది కాదు. కాని యీ కుతంత్రముచే దేశమునకు గొప్ప హాని వాటిల్లినది. స్వీయనిర్మాణ చాతురిచేతను, మంత్రకౌశలము చేతను సర్వాంగములందును లోటు రానీక నిరుపద్రవముగా రాజ్యమును నడపు శిల్పకళ నాగలి, మేడికఱ్ఱ, కొడవలి, మంగళసూత్రము మున్నగు సాంఘిక మతజీవనమున కుపకరించు సామాన్యోపకరణముల సిద్ధము చేయుటలోఁ దన యతిలోక తేజమును సంకుచితము చేసికొనవలసి వచ్చినది. ఈమధ్యకాలమున శిల్పకళ విస్తరిల్లిన యుదాహరణములు కొన్ని కన్పట్టుచున్న వందురేమో? అవి బౌద్ధుల రోజులలో, అక్బరువంటిమహమ్మదీయ సామ్రాట్టుల పాలనాకాలములో, దుర్మంత్రములకు లొంగక యథార్థదేశకల్యాణము నభిలషించు

స్వతంత్రహిందూరాజుల భద్రపరిపాలన దినములలో నయి యుండెను. పై సందర్భమున అనుదినజీవికి నుపకరించు కొన్ని వృత్తులు మాత్రము కొన యూపిరితో నుండి తమ యునికిని నిల్పుకొన్నను, అఖండమయిన యంత్ర శిల్పము, అతిలోకములైన శిలాశిల్ప రహస్యములు, పెక్కు శిల్పకళా సాంప్రదాయములు ఎన్నెన్నో విస్మృతిగర్భమునఁ బడి ప్రయోగప్రచారము లకు దూరమగుటయే గాక, దేశ దేశాంతరుల హస్తగతమయి పోయిన వనుట రూఢి. అయ్యవి యీ కాలమున "హిందూదేశములో నెప్పుడైనను యంత్రశిల్ప మున్నదా?" యని భారతీయులు సందేహించునంతగాఁ దమ యునికిని గోల్పడి యున్నవి. ఆధునిక యుగమున సుసంస్కృతబుద్ధులగు నేకొలఁది మందికో తక్క సామాన్య పండిత పామర లోకమునకును దమ శిల్పాచార్యుల శిల్పకళాప్రతిభ, తమ దేశపు శిల్పశాస్త్ర మహత్త్వ దిఙ్మాత్రముగా నైనను దెలియదనుట పొరపాటు కాదు. అయినను విమానాధికరణము, లోహతంత్రము, సమరాంగణ సూత్రధారము, శత్రుఘ్నీయముల వంటి యుద్ధగ్రంథములు తమ యాత్మచరిత్రము నాలకించువారలకుఁ జెప్పుకొనఁ జూచుచునే యున్నవి. కాని యాలకించు నుదారులు లేరు. ఆవసరమైన పోషణము నిచ్చు దాతలు లేరు.

అమూల్యములైన శిల్పశాస్త్రము లెట్లు లబ్ధములు లేక కృచ్ఛ్రలబ్ధములు నైనవో, అట్లె తదుపదేశకాచార్యుల చరిత్రములును బ్రచార భూమికపై తెర వాల్చుకొన్నవి. తచ్చరిత్రలకై ప్రయత్నించు కృతబుద్ధులును లేరు. నేఁడు సనాతన భారతీయ శిల్పకళౌన్నత్యము ఇట్టిదని ఏపాశ్చాత్య సోదరులో నిరూపించు వరకును మన సారస్వతోపాసకు లద్దానిని బయలునకు రానీయకయు, తామై తచ్చరిత్ర నిర్మాణమునకు గాని, పునరుద్ధరణమునకు గాని పూనుకొనకున్నా రన్నచో శిల్పజనని ఎట్లు కన్నీరు విడుచునో! శిల్పజననియే కాదు–పురాతన శిల్పచరిత్రమును సింహావలోకనము చేసికొన్న నే భారతీయ హృదయము దురంతశోక సంతప్తము గాదు? ఇప్పట్టున నొక్కటి మాత్రము సంతోషింపఁ దగినది. శాస్త్రగ్రంథములు శిల్పులు మాటువడి పోయినను, అవ్వారి పూర్వ నిర్మితులు సారస్వతగ్రంథములనుండి తొలఁగింపఁ బడలేదు. పుష్పకాది విమానములు, ఆగ్నేయాద్యస్త్రములు, మేఘనాథుని యుద్ధచిత్రములు, మయ

సభా నిర్మాణములవంటి దృశ్యములు, సముద్రమునకుఁ గట్టిన వారధి వార్తలు, అద్భుత ప్రభావములగు యానవిశేషములు నున్నట్లు గ్రంథములందలి యభివర్ణనలు తుడిచివేయ బడకున్నందుకు సంతోషము. అయిన నవ్వాని నిర్మాణమున శిల్పప్రభావమునకు బదులు కేవల మంత్రప్రభావము మాత్రము చేరుకొన్నది. అయినను తొందర లేదు. ఉపలభ్యమానములగు లక్షణగ్రంథముల చేతను, ఉచితప్రయోగ విధానములచేతను, అదిమంత్రమో లేక యంత్రమో వ్యక్తము చేసికొనవచ్చును. ఈమధ్య నొక శిల్పశాస్త్రపరిశోధక మిత్రుడు మత్స్యావతారమును పూర్వకాలములోనున్న జలాంతర్గామి (Submarine) అని పలికి యున్నాఁడు. ఇట్టి రహస్యములు పెక్కులు మంత్ర తంత్రముల హడావుడిలో తమ యునికిని గోల్పడి పోయినవి.

ఇఁక నంతటి శిల్పమునకు స్రష్టలైన యాచార్యుల చరిత్రల స్థితియు శంకా సంకులముగనే యున్నది. ఆదిమ శిల్ప ఋషులగు సానగాదులను గూర్చియు తత్సంతతినిఁ గూర్చియు నూహలకన్న నపోహలే ఆధునిక వాఙ్మయమున చెలరేగి యున్నవి. తెలిసీ తెలియని వ్రాతలతోడ జనసామాన్యములోనికి సత్యచరిత్రాపహృతమునకు మారు తారుమారు చేయఁబడిన కాల్పనిక చరిత్రల విషౌషధమే వ్యాపింపఁజేయఁ బడుచున్నది. ఇది చిత్తవిభ్రమమునుగూర్చి విపరీతపరిణామమును కల్గించు ననుటలో నాశ్చర్యమేమి? జక్కనాచార్యుని వంటి ప్రసిద్ధ శిల్పచరిత్రమే పలువిధముల వికల్పింపఁ బడుచుండె. ఏకళ్లో శాసకులచేత ఘన ప్రాచీనార్వాచీన నిర్మాణములు సృజింపఁ బడినవో అట్టి వారి చరిత్రములును కనుమరఁగి పోయె. ఈ కార్యములు చేతనైనంత వరకు నిర్వహించి వాఙ్మయసేవ యొనర్చుట యొకటి మా తాత్పర్యము. అయిన నీ చరిత్రల కెల్లను ప్రమాణము లెక్కడ దొరకునని ప్రశ్న కలుగవచ్చును. సుస్పష్టములుగనో, అస్పష్టములుగనో లభించెడు ప్రమాణముల నాధారము చేసికొనియే ఈ కార్య ముపక్రమింపఁ బడునుగాని, కల్లబొల్లి కథాకల్పనములతో ప్రాతపుంతలఁ బోవుట మా తలంపు గాదు. శిల్పగ్రంథములును, ప్రాచీన శాసనములును, ఐతిహాసిక దృష్టాంతములును అను మైలు రాళ్ల నూతగాఁ గొని మా యాత్ర సాగవలసి యున్నది. "సమ్మెబండలు కళా స్వామి శీర్షముపైని దొరలిన విసపుఁ బ్రొద్దులు గతించె" నని మా కవి

సోదరుఁ డన్నట్లు తన్నుఁ బట్టిన గ్రహణముల నెల్ల వదలించుకొని, తన 'శాంత శివసుందర' స్వరూపములతో శిల్పిచంద్రుఁ డాధునిక పరాధీన భారత దేశము నుద్ధరింపవలసి యున్నాఁడు. ఈతనిచే విధ్యుక్తధర్మమును నిర్వహింపఁ జేయుటకు లోకమును ప్రోత్సాహ మీయవలసి యున్నది. కార్మిక కర్షకులు చేతులు కలుపుకొని శిల్పాచార్యుని చేతిజాడల ననుగమించి మాతృదేశోద్ధరణము చేయుదు రనియే మా విశ్వాసమును. ఈ యంశమును నాయకులు కంఠతః చెప్పక పోయినను చేతలను బట్టి వారి హృదయ మిదియే యని తెలియుచున్నది. ఈసమయమున పూర్వసాహిత్యవాణి దాచి పడవేసిన శిల్పవిద్యాప్రవీణుని సుకవిసంవిన్నవీన జీవలేఖిని విస్మయముపొందిచిత్రించుట యనవసరము కాదు.

ఆధునిక యుగమున లోకమున కీయుద్యమము మూలమున నేమి ప్రయోజన మున్నదను ప్రశ్నమున కిదే సమాధానము. పారిశ్రామికముగను, శైల్పికముగను వెనుకఁబడి పరాధీనమై యున్న ప్రస్తుత భారత దేశమునకు నూతన జీవము చేకూరవలె నన్న శిల్ప పరిశ్రమలు పెంపొందుటకన్న గత్యంతరము లేదు. ఈ రహస్యము నెఱింగియే మహాత్మునివంటి దేశనాయకులు వార్ధావిద్యా విధానము మిషచేత పరిశ్రమ ప్రీతి పెంపొందించు చున్నారు. అట్టితటి ప్రాచీన శిల్పి శిల్ప చరిత్రముల నావిష్కరించి, తద్గోచరావసరముల నిరూపించు నీ మా ప్రయత్నము ప్రయోజనకారి కాకపోదు. యుగములనాఁటి చరిత్రములను తలపోసికొని యుబ్బి తబ్బిబ్బు లగుటతో మాకు తృప్తి లేదు. ఆధునిక యుగమున శిల్ప పరిశ్రమలు ఆచరణరూపమున వినియోగపడు మార్గముల నేర్పరచుటలోను, మా మండలి దేశసేవ, భాషాసేవ చేయఁగోరు చున్నది. కావున నీయుద్యమము దేశకళ్యాణమును గోరు జాతీయోద్యమ నాయకుల యాదరణమునకును బాత్రము కాఁగలదని యాశింతుము.

కేవల శిల్పి శిల్ప చరిత్రములే గాక ఉద్ధతుల సంఘర్షణమున నలిగిపోయిన దేశోపకారుల దైన్యవృత్తములును మా కభివర్ణనీయములే యనుట మామండలి పోషక సోదరులు మఱువఁ గూడదు.

ప్రప్రథమమున మా యాశయముల కనుగుణమైన "కల్హారమాల" యను నీ కావ్యమును ప్రకటింపఁ గలిగినందులకు సంతసము. సుప్రసిద్ధ నవ్యకవులలో

నాకరగు శ్రీశరభాచార్యులుగా రాంధ్రలోకమునకు సుపరిచుతులు. శ్రీవారి సంస్కృత హృదయమున రసరంగితమై జాలువారిన ఈకావ్యమాలను ఇదివఱకే పత్రికాపాఠకలోక మెఱుంగును. ప్రస్తుతము మాయుద్యమమున కర్దాని నిచ్చి తోడ్పడిన ఆచార్యులుగారికి మా కృతజ్ఞత.

సంపాదకీయాశయములలో బారలు మూరలు వేసి, ఆచరణ రంగమున నొక యంగుళమైనను పయనించలేని సంస్థలస్థితి మాకును బట్టకుండ నభిమానించి ప్రోత్సహించి పోషించి మమ్ము కృతకృత్యులఁ జేయుభారము దేశాభ్యుదయ కాంక్షులగు తెలుఁగు సోదరులమాఁద నున్నది.

ఈ మా యభిప్రాయములను స్వప్రమాణముగా వెలిఁబుచ్చు చరిత్రగ్రంథములను గాని, గద్యపద్యకావ్యములనుగాని, కథలుగాని, నవలలుగాని ప్రకటించి యాంధ్రమాతకును దద్ద్వారమున భారతమాతకును యథాశక్తి సేవయొనర్చు టలో కృతకృత్యత నాపాదింప నాశీర్వదించు నని జగన్నేతను ప్రార్థించు చున్నాము.

ఇట్లు,
సంపాదకుఁడు,
విశ్వజ్ఞ గ్రంథ మండలి.

తెనాలి,
ఉగాది వృష.

# మ న వి

నా విద్యాజీవనమున అపుడపుడు బొడమచు వచ్చిన పలుతావుల పూలివి శ్రీ గురు చరణుల షష్టిపూర్తి పూజలో గూర్చి వినియోగింప నెంచితిని; కాని దుర్విధి వశమున వారి ఆయుః పూర్తి మున్నే జరిగినది. ఆదివ్యమూర్తి కి నేటికేని ఈపాటి సమర్పణము చేసుకొని కృతార్థుడగా నెంచితిని. ఇందు ఒండు రెండు ఖండికలలో మా * అనర్ఘ రాఘవ మధుర లేఖినీ స్పర్శయుఁ గలదు. ఈ కల్హారమాల ఏ లవ మేని ఆమోదము, రసజ్ఞ జగత్తున కందించినచో ధన్యోహమ్మను కొందును. నా యీగ్రంథమును ప్రథమ పుష్పముగా స్వీక రించి ప్రకటించిన శ్రీ విశ్వజ్ఞ మండలి వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

కృ తి క ర్త.

* కొండూరి వీరరాఘవాచార్యులు.

—

# అ భ్యు ద య ము

స్వకృతములు సుఖ స్వప్న డోలికల నెక్కి
యూగియూగి యానందాన నొడలు మఱచి
పండి నిదురించు నీ ప్రజా ఫాలసీమ
నెట్టి దిన చర్య వ్రాసెనో ఈశ్వరుండు ?

అమృత రూపిణి ప్రత్యూష స్సమయ రమణి
లలిత లలితమ్ము మధురకల స్వనమ్ము
తీర్చి వచ్చు ప్రబోధ గీతికలు పాడి,
ఈ జగ న్మాంద్య దశలు మాయించు నపుడు .

సవితృకరరాగ సంస్పర్శఁ బువునిసుంగు
విప్పుకొని కన్నుదేకు లుర్వీ మనోజ్ఞ
దర్శనంబున కసిత దృక్తతులు నెఱపి
విందుగొనె ననఁ దుమ్మెదల్ వెడలు నపుడు.

ప్రకట సెలయేటి యలపాట పల్లవులకుఁ
దనదు పాటను గలిపి, సుధారసాభి
షేకముల విశ్వదేవి నర్చించి యలరు
నప్పికాంగన సంస్తుతులైన యపుడు.

ఏవొ యుత్సాహపవనంబు లేచి వీచి
మా మనస్సారసము లూఁచి, మాకుఁ గూర్చె
నీ ప్రఫుల్లీకరణ భాగ్య మీ కొలంది
కమ్మ వలపుల జగము స్వాగతము వలికె.

—

# వి శ్వ జ న ని

ఏను వియత్పథాలఁ జరియించుచు మబ్బుల నూతు; మబ్బుల
పై నిదురింతు నాకసపు టచ్చపుఁ బాన్పున; వాగురూపులం
బూని స్రవించుచున్ బ్రకృతిపొంగెడు గానము సేతు; నన్నియున్
నేనయి నేనె యన్నియయి నిల్చి జగత్క్రియ మేర్పరించెదన్.

ఏన నియంతఁ జేతు నెదియే నరి మత్త గళోపలంబులన్
సానలు దీఱవే యసులు చానల చేతుల పూఁప గిన్నెలన్
దేనియ లాను తేంట్ల కుపదేశముఁ జేసిన గీతికా మృదు
స్వానము లెట్టి వీర కరవాలపుఁ దాఁకుడు లైన నాపవే ?

ఆ మురళీ ముఖస్రుతము లా ప్రణయ ప్రణవామృతోర్ము ల
న్నీ మును వ్రేఁతబోఁట్ల యెదనిండి భరంబయి యొలికె వైష్ణవీ
సీమలఁ బొంగులెత్తినవి; జీవులు గ్రుంకులు వెట్టి జన్మ దో
షామయ శూన్యులై వెలిఁగి రాయెడ నాకరుణా లవంబునన్.

క్రతుహింసానల జిహ్వా ప్రాణులయసృక్ పానంబు గావించి,ధూ
మ తమస్సుల్ విరజిమ్మ లోక మనుకంపా శూన్యమై పోవ,ను
న్నత మార్గమ్ముల నుండి జీవకరుణా నవ్యప్రబోధావ్య యా
మృతధారాళి జగమ్ము బుద్ధఘనుఁడో మెన్ దొల్లి నాప్రేరణన్.

ఏసుని దీనవాణి చరియించిన దేగతి? గాడ్పు వీఁపుపై
మోసి చనం దరంగ రవముల్ తమ యందున దాఁచి పర్వఁగా
మ్రోసెను దీవులన్నిఁటను మొన్నఁగదా వినియెన్ జగచ్ఛ్రుతుల్
ఆ సమయమ్మునన్ "శిలువ" యా జగమిచ్చిన కానుక వానికిన్.

లేదుగదా ప్రతీచిఁ గదలించిన యాతని భావమారుతం
బీ దినమందు; జీవరస మెండెనుగా మత శాఖలందు, నిం
కేది విధాన మీజగతి కీశుని తత్వముఁ జూపఁ ? గర్మయో
గీ! దయసేయవోయి! వెలిగింపఁగదోయి! విభూతి దీపికల్.

నీ నుడులు ప్రాకు దెసలన్నిఁ; నీ వొసర్చు
పనులు నిద్రాణ జగతికిఁ బనులు వెట్టుఁ;
నీ తలఁపు లందఱి యెదల నిండి యూఁచు;
నీవె సో ఈశ్వర పదము జీవ తతికి .

ప్రణవ తత్త్వాలవాల సారమయి, ఏ స
ఖండ సత్య ప్రకాండ శాఖలయి, భిన్న
దిక్కు హయార్త్తములను బూఁచితివి మహర్షు
లనుఁ బ్రవక్త్తల నిఁక మహాత్మునిఁగ నిన్ను
చల్లుమి ! యహింస యను తావి, సత్యమధువు;
తండ్రి ! ... ... ... ... .

" కాలపురుషుని తోటలోఁ గల్ప కల్ప
ముల బుష్పం బాద లెందేనిఁ గలవు; వింత
వలపు లెగజిమ్ము రంగు రేకులను దొడిగి
అమృతధారలు గురియు మోహన సుమమ్ము
భారతీ లత బూచె సంబరము తోడ;
రండు రా రండు దిగ్దేశ రమణులార !! "

—

# త్యాగరాజు

౧

పాలబుగ్గ లూరెనో త్రయీఫల రసమ్ము
చిఱుత కెమ్మోవి సంపులఁ జింది పడిన
అమ్మధురమూర్తి ముచ్చ్చై యాంధ్ర జనని
ప్రాణముగఁ బెంచుకొనెఁ బురావ్రత ఫలమ్ము.

అతని వీణియ తీవ పూర్వాంధ్రకీర్తి
గీతికా నిస్వనమ్ము మ్రోగినది; అదియ
వినియు వినరాని యట్లు శబ్దించుచున్న
దీ హృదాకాశ మండలి నింత వఱకు.

తనదు నుడిచేవఁ దెన్గు మోడునకు నూత
న ప్రసవ వాసనలు పట్టు నాఁటి వేళ
విశ్వ కల్యాణ ఘటి సమీపించు యోగ
బలము దర్శించినారు దైవజ్ఞ వరులు .

గోపికా దివ్య విరహ చక్షుః ప్రసన్న
మాధవస్వామి ఘననీలమసృణ చరణ
కింకిణీ నిక్వణ క్వణ గీతికలను
హృదయ వల్లకిపైన మ్రోయించి నాఁడు !

అతఁడు వైష్ణవ మహిమామ్నాయ భాష్యమ్ము
పరమ వేత్త పొంగి పొరలుచున్న
దుఃఖ బాష్పవారిఁ దోఁగుచున్నాఁడు లో
కష్ట కలుషరాశిఁ గలఁగియేమొ !

ఏ నవుల వెన్నెలఁ గువలయేందిరాత్మ
అలరిపోయె, శిలాహృదయమ్ము లూరి
రసమయతఁ బొందె, నవి కాయరాద మఱల
మేము వెలుఁగొంది కనెద మమృత పదమ్ము !

---

# † శు కా బ్ర హ్మా నం ద

శ్రుతి సంపుటములో వేదాలకు భాష్యకర్త. మత - రాజకీయములందు శివాజీ చక్రవర్తికి గురువు. ఆధ్యాత్మికానుభవములో సనాతనఋషు లట్టి వాఁడు. కళావిషయమున శివాజీ ఆస్థాన శిల్పాచార్యుఁడు. జ్ఞాన-విజ్ఞానముల సురుచిర సమ్మేళన మూర్తి. విశ్వకృత్యాదపీఠము మీద త్రికాలాలు పరిమళించే పారిజాత పూజాపుష్పం. మహారాష్ట్రభూమిలో పుట్టిన ఒక అనర్ఘరత్నం-ఎఱుఁగుదురా? బ్రహ్మానందస్వామిని!

భాషామహాదేవి పసిఁడిసేసలతోడ
విద్వన్మహస్సు దీవించు నపుడు
సవన వేదిక వేద జననీ సుభగవాణి
శ్రీవిరాణ్మహిమ ఘోషించు నపుడు
చిరకృత వ్రతఫల సిద్ధి కన్వయమాత
మోదబాష్పాంబుల మునుఁగు నపుడు
వాస్తు మంగళమూర్తి స్వవర ప్రసాదమ్ము
గుడిపింప సంబరం పడిన యపుడు

---

† ఇమ్మహామహుని లోకోత్తర చరిత్రము మహారాష్ట్రదేశమున సుప్రసిద్ధమై యున్నది. తెలుఁగు దేశమున కా కుసుమ సౌరభమును దెచ్చినవారు శ్రీ నిరంజనశాస్త్రిగారు. చూ. ప్రబోధినీ పత్రిక.

వేల్పు కప్రపు టారతుల్ వెలిఁగి నపుడు
విశ్వకల్యాణ ఘంట శబ్దించి నపుడు
ఏ మహాసాధ్విఁ బచ్చి బాలెంతఁ జేసి
పొడమినాఁడవో నీవు మా పుణ్యరాశి !

ఆతత నైగమార్ణవ గుహాంతర సుప్త చిరత్నరత్న ము
క్తాతతు లాత్మసూత్ర కలితంబులుగా గ్రథియించి, భారతీ
మాతృగళాంకితమ్ముగ సమర్పణఁ జేసిన నీవు, సాహితీ
జ్యోతివిగామరాటులగృహోత్కరముల్ వెలిఁగించుటబ్రమే?

ఒక్కొక్క పలుకులోఁ దొణిఁకి యుండిన పేరిమి, ఒక్క లీలలో
గ్రుక్కిన తత్వ, మొక్క కృతి కోశములో నెలకొన్న ప్రాజ్ఞమహా
వాక్కుల యర్థమారసిన పండిత పామరు లీసుఁ జూపిరో
అక్కజమైన బత్తిఁ గపురారతు లిచ్చి జొహారు చేసిరో !

జిజియా పున్నెముపండి పుట్టిన 'శివాజీ' రాజు మూర్ధంబు నం
టి, జయాశీస్సుల సేసఁ బ్రాలిడి మరాటీ దుర్గభూమిన్ యశో
ధ్వజముల్ తాండవ మాడఁ జేసిన ప్రశాంత బ్రహ్మతేజస్వి! ని
న్నె జగం బీగతి విస్మరించి కలుషాగ్నిం గూలె సైరింపుమా !

ఏ మలీమస పాషాణ హృదయతలుల
నేని దైవకళామూర్తు లేర్పరించు
సకల పావన శిల్ప నిష్ణాతవృందఁ
జేనియెద కేమి కఱవు మృడాని మూర్తి.

ఉలియంచుల్ సృజియించియున్న యివియేయూహాప్రపంచంబులో
పలి సౌందర్యము గ్రుమ్మరించినవా! ఏస్వర్గీయ తేజస్సు లీ
యిలకున్ డించి ప్రతిష్ఠఁ జేసినవా! కానీ! త్వత్పురాదిష్టముల్
నిలువం గల్గెను నేటికింకను భవానీ దేవతారాధనల్.

నీ వమృతస్వరూపివయి నిత్యుఁడవై నిగమోక్తసూక్తమా
లావళికాపరీమళ గళంబున బ్రాహ్మణ శిల్ప భూమిపై
దీవన తేనియల్ గురిసి దివ్య శుభోదయమున్ రచించి యు
న్నావు! తుకాన్వవాయమనినన్ భువి యెంత కృతజ్ఞ కావలెన్?

అంఘ్రి రేఖల ఊటిన అచ్చమైన
వెలుఁగు వాఁకలు వెల్లువల్ విరిసి విరిసి
ఈశిథిల మనోగుహా లావహింప నిమ్ము!
పాదముల మ్రొక్కెదము కళాబ్రహ్మమూర్తి!

—

# ప్రే మో ప దే శ ము

మనసులో నేమి యూహాలు మలగుచుండె ?
మాటి మాటికి నవ్వుకో మరగినావు !
ఐదువల దీవెనల మనోహరునిఁ జేరు
ఉదయ కుంకుమ నోమకే ఇది లతాంగి ?

తెలతెలవాఱుకే తడవు తీయని లేనవ్వు మోముసోరు లిం
తలు విరజిమ్ముచున్ గరమునం జిరుపళ్లెరమందు గందముల్
చిలికిన కుంకుమాక్షతలు చేకొనుచుం గమనీయ నూపురం
బులచిఱుపాటలన్ మెయిలుపుల్కలుగాఁజనుచుంటివెంమలన్.

మేలిపసిండి వన్నెమెయి మీఁది ముసుంగుల నుండి జవ్వనం
బేలెడు చిన్నదోఁచెఁ దమియెత్తెడు కోరిక పంటగా వయ
శ్శీలము లెన్నుకొన్న పతిఁజేరుటకై వ్రత మాచరించుచో
మాలతి పొన్నమైఁ బెనఁగి మానని మక్కువఁ గోరుకో దగున్.

———

# రాఙ్మహేంద్రము

ఇది గోదావరి దివ్య నీరములచే నెన్నెన్నొ యేండ్లాదిగాఁ
బదునైపోయిన సుప్రదేశమని కావచ్చుం గళా సస్య సం
పద వర్ధిల్లెను నన్నపార్య కవితా వ్యాపార మార్గంబులం
దిది యీఁరోజుల రాఙ్మహేంద్రమయి యట్లే తేజమున్ జిమ్మెడున్.

ఎన్నఁడో భారతీదేవి ఈమనోజ్ఞ
రాజమందిర మంచు నిరంతరమ్ము
నిలిచి పోనెంచినట్లు గన్పించు నాకు
నీ కళాశాలలను జూచి యేగు నపుడు !

తీరిచి దిద్ది తేనియల తెన్గు తెనుంగుల కెల్లఁబంచి, భా
షారమణీ సమర్చనలు సల్పిన భక్తుఁడు నన్నపార్యుఁడె
వ్వారల పూజలన్ గొనఁడు? వానిదె పొమ్ము పురాంధ్రవాఙ్మయ
శ్రీరుచి కంకురార్పణముఁ జేసిన మంగళహస్త మారయన్.

ఎవ్వాని రసవీచి నివతళించిన గాలి
తెలుఁగుల యెదవెట్ట తీర్చివైచె
ఎవ్వాని కావ్యసాహిత్యంబులో వాణి
తెలుఁగుల నిదుర మేల్కొలుపు లయ్యె
ఎవ్వాని సుకళా మహీరుహ ప్రరోహములు
తెలుఁగువారికి వెల్గు తెన్నులయ్యె
ఎవ్వానిఁ జాళుక్యనృపతి తానై కొల్వఁ
దెలుఁగుల మెయిలెల్లఁ బులకలయ్యె

ఎవ్వని యఖండయశము నాయీపురాణ
పుణ్యరత దక్షిణాపథ భూములెల్ల
వెలుఁగురాశులు చేసె వెన్నెలలుగాసి
అతఁడు నన్నయ్య మనకు లేఁడాయె నేఁడు.

చిరపుణ్య ఫలగుణ శ్రీరాశి సారంగ
ధరు నెత్తురింకిన తావు లివిగో
"అమ్మంగదేవి" హృదంబురుహాధీశు
కోటచిన్నెలు మొండిగోడ లవిగో

ప్రళయ భైరవ జిహ్వికలువోలె నడయాడు
తెలుఁగుఁ గత్తుల పాడుదిబ్బ లివిగో
శైవమతౌన్నత్య సమయ మార్కండేయ
మందిరచ్ఛిన్న నిర్మాణమదిగో

ఆంధ్ర వైభవ దీపము లారిపోయి
చీఁకటులు మూఁగుకొన్న యీ సీమలన్ని
మనసుఁ గెరలించి కలఁచి యుమ్మలిక ముంచి
ఏ మహావేశమో యుదయింపఁ జేయు.

ఈ పురాతనోర్వి ఖండమిట్టు లగుట
కే తురుష్కనృపోద్ధతి హేతువయ్యె!
ఏ పురాకృత దుష్కృతి పాపమయ్యె
ఎట్టు లాంధ్రాగ్ని యారిపోయినదొ నాఁడు!

అదిగో కర్తవ్య దివ్యపథాంతరమ్ము
హృదయమా! పక్షములు విప్పి ఎగురవేమి?

... ... ... ... ...

... ... ... ... ...

---

# * రణభేరి

అవిగో ! అవిగో ధూళిమేఘము
లాకసంబునఁ బ్రాఙ్ముఖంబుగ
గబగబా పఱతెంచు చున్నవి
కారణంబేమో !

ఈ సనాతన శాంతలహరీ
హృద్యగానము నణఁచి వైచుచు
ప్రబల భయద ధ్వానములు వినఁ
బడుచు నున్నవెవో !

అశ్వదళహేషా రవమ్ము ల
నంత సైనికపద విఘట్టన
లట్లు దోఁచెడి నే మహీశు దు
రాశ ముంచినదో !

యవన కేతన మదె జగమ్మున
కవనతినిఁ గల్పించి నట్టిది !
కర్మభూమిని వ్రాలి యిఁక ము
క్కలయి పోదా !

* ఇది పురుషోత్తముని కాలమున నెత్తివచ్చిన 'అలెగ్జాండరు' దండయాత్ర నుద్దేశించి వ్రాయఁబడినది.

ఈ స్వతంత్ర రసోర్మి నెదిగిన
తృణ దళాగ్రము లీటెమొనలై
‡ " పురుషపురి " స్వాతంత్ర్యలక్ష్మి
పూజఁ గావవా కో !

ఆదిశిల్పి తపస్సు నంతయు
అచ్చు పోసి జయింప నిచ్చిన
భాగ్యభారత ఖడ్గ ధారలు
పదును చెడవు సుమా !

రండు వీరులు లెండు బాలు ర
రాతి వాహిని శోషిలంగా
గ్రీష్మవేళార్క ప్రతాప మొ
కింత చూపండి .

మృత్యు దంష్ట్రిలు బెండుపూసలు
మెత్తనివి ఆటలకుఁ దగినవి :
పిన్నగుండెల చండశౌర్యము
పిండి పోయండి !

‡ పెషావర్.

ప్రాచ్యభూముల గహన దుర్గా
గ్రముల నిల్చి నృపాల సింహము
గర్జిలం త్రిజగములు బెగ్గిలి
కదలి పోవలయున్ .

ఇదిగో పురుషోత్తమపతాక
మ్మిచట మూఁగుడు ! దీని నీడల
వీరలోకమొ ! రాజ్యవలయమొ !
పెనగి యాడెడిని !

విశ్వదేవా ! ఇవె జోహారులు
వీరఖడ్గమ ! ఇదె నమస్కృతి !
సమరజయ మాశీర్వదించిన
సాగి పోయెదము !

పదండి రథికులు
ప్రధానులారా !
పదండి సైనిక
పదాతులారా!
పదండి ప్రాణా
ర్పణ మ్మొనర్పన్.

---

—

# దు ర్గా దా సు

పౌరుష ప్రతాపములు మూర్తీభవించిన రసపుత్ర వీరశిఖామణి. 'మార్వా' క్ష్మాహీపతి జస్వంతసింహుని సేనానాయకుఁడు. ఏకపత్నీవ్రత పాలనము కొఱకై యావద్భారత సామ్రాజ్యమును గూడఁ దృణీకరించి మృత్యువున కొడి గట్టిన మహాత్యాగి. సమ్యగ్దృష్టిలేని 'అజితసింహు'ని కోపమునకు గుఱియై యాతని రాజ్యమును గూడ వీడి స్వేచ్ఛాజీవితమున కృతార్థత నందిన ఆదర్శ భారతయోధుఁడు.

తుపాకలఁజేని నోర్తునని దువ్విన మీసలు దోపఁజేసెనో
పిఱికిని బాదుషా యెడఁద బిట్టువణంకి స్వకీయ తేజమే
దొరఁగెను నాఁటి నీ విజయ ధుర్యముఖద్యుతు లెంత వెల్గెనో
మఱల స్మరించుకోవలచు మాకు సదృష్టము లెంత పండెనో.

పావన మేకలింగ భగవానుని పాద యుగాన నార్చి ఏ
దేవి యెడంద యెండినదో తేజము ప్రోవయి పుట్టె ఆ తమో
జీవనమార్గముల్ వెలుఁగఁజేసి నవాభ్యుదయమ్ముఁ గూర్చి యు
న్నావపు డుబ్బెనో ప్రజకు నాళము నాళము జీవ రక్తముల్.

ఈ వరుదేరుటల్ వినిననే అరచత్తురు వైరిరాజు లిం
కా విలయోగ్రవహ్నిశిఖయై నటియించెడు శాతఖడ్గ ధా
రావరమేల నిల్వఁగలరా పగవారు ? త్వదీయ దోర్బల
శ్రీవిజయధ్వనుల్ సెవులు చిల్లులుఁబో వినఁబడ్డ వెల్లెడన్.

ఉయ్యాల పొత్తిళ్ళ నొదిగి ఏకాగ్రివై
ఏ వీరకథలు విన్నావో జోల
పసికేళ్లతో ఆటవలపుతో నే బొమ్మ
కోట గోడలు పడఁగొట్టినావో
'చెరపట్టి' లో వైరి సేనాపతి వ్యూహా
నిర్భేదనము లేమి నేర్చినావో
మాతృదేవీ పదస్మరణార్చనములనే
భరత ధాత్రీసేవ మరగినావో

ప్రకృతి నీరవవాణి దివ్యప్రబోధ
నే మహాచ్ఛిలవత్కళ లెఱిఁగి నావో
ఏమి సత్వప్రతాపంబు లీ మనోజ్ఞ
మూర్తి యిమిడించుకొని కండ్లముందు వెలిఁగె.

'అజితు' ప్రాణాలకై ఆత్మోపహార సం
కలిత సంగ్రామ రంగమున నుఱుక
'గులనారు' కూర్మి కౌఁగిలి ముక్కలు రోసి
మృత్యు గహ్వరపాత మేవరింప
లలనాసవాతి లాలసుఁడు 'శంభాజీ'కిఁ
బ్రియమూఁది సంకెళ్ల బిగిసి పోవ
మార్వాణ్ణవ నృపాలమణి కినుక నిప్పులు
చల్లని నగవుతో సైచి వెడల

నీ హృదయకోశ నిక్షిప్తనిధులలోనఁ
గొన్ని గుణరత్నరాసులు గోచరించె
మా చరిత్ర చక్షుల కింక మఱఁగియున్న
దెంత యైశ్వర్యమో ఎవ్వఁ డేమెఱుంగు ?

—

# శిల్పి

ఆ పురాతన గుహల గాఢాంధకార
శయ్య నిద్రాణ శిలల కైశ్వర్య మొదవి
కళలు మూర్తీభవించు విగ్రహము లయ్యెఁ
గేలి యులితోడ వానిఁ దాఁకితివో లేదో.

శిథిల విగ్రహ నఖ శ్రీరేఖలోఁ గూడ
విశ్వ మోహన శక్తి వీడ లేదు
రిపు ఘనచ్ఛన్న కీర్తిజ్యోత్స్నలోఁ గూడ
సాంద్ర ప్రకాశమ్ము సమయ లేదు
యుగధూళి పడి మాసియున్న రూపునఁ గూడ
జయ శాసనము వన్నె జంక లేదు
ప్రతిభాగరిమ సంస్మరణ దప్పినఁ గూడ
భువన స్థితిని గోలుపోవ లేదు

చరితలో నిన్ను వెదకి వేసారి గూడ
ఘనుల హృదయాల గాన మాగినది లేదు
నీ కళాకీర్తి జయ మనీషా కథాళి
యే మెడఁద వీణ పాడుకో దోయి శిల్పి !

ఈ మలీమస పాషాణ హృదయ ఫలక
ముల వినిర్మల మృదుల కాంతులు స్రవించు
చున్న దైవకళామూర్తు లుదయ మయ్యె
నీవు మలచిన రూపు ధ్యానింప శిల్పి !

బ్రహ్మ తేజస్స్రవంతి పాఱఁ గృశియింపఁ
బార్థివ జయ పతాక నిల్వఁ బడిపోవ
సస్యలక్ష్మి కృపాకటాక్షములు వ్రాలఁ
గ్రమ్మఱిల నీవెపో మూలకారణంబు !

బౌద్ధయుగ వైభవము ఱాతి పలక పుటలఁ
దెల్లముగ వ్రాయఁ గాల శైథిల్య ముద్ర
పడిన యవిచూచి చదువుకోఁ గడఁగి నపుడు
నీవు దలఁపున రాఁగఁ గన్నీరు గార్తు.

* *

నియత క్రియాశక్తి నిలచిన నీవు
ఱాలలో దేవుళ్ళ రప్పించినావు !
పశు మానవుని భక్తి పరునిఁ జేసితివి !
పుణ్య దుగ్ధంబులఁ బొంగించి నావు !
విశ్వ గేహం బెల్ల వెలిఁగించి నావు
లోకసేవా నిధిలో మునిగినావు !!
కర్మయోగమునఁ గాకలు దేటినావు !

ఓ లోకశుభకల్ప ! ఓ మహాశిల్పి !!
ఓ విశ్వకృద్భక్త !!! ఊరకున్నావ ?

*　　*　　*

ఆశాతటమ్ము లల్లాడి పోవంగ
నీ యశో వాహినుల్ నిండి పోనీర !
భువన పీఠము మీఁదఁ బూజింపఁ బడఁగ
హృదయ వీణాతంత్రి నెపుడు మ్రోఁగుమురా !
నీ కళాతోరణాల్ నెలకొల్పు కొనఁగ
ఉలి త్రుప్పు కుప్పలు దులిపి వేయుమురా !

*　　*　　*

మఖిల భారతదేశ మంతా
భగవదాలయ వాటిఁజేయరా !!
భక్తిబంధుర భావములతోఁ
బ్రణతు లిచ్చేము !!
శిల్పి !
ప్రస్తుతించేము !!!

*　　*　　*

శిల్ప విద్యాప్రవీణు దాఁచి పడవేయఁ
బూర్వ సాహిత్య వాణికే పుట్టె మునిఁగె ?
విస్మయము నంది సుకవి సంవి న్నవీన
జీవలేఖిని నిన్ను పూజింపఁ గలదు .

ప్రత్యూష సాంధ్య రాగ నీరాజనములఁ
బ్రాక్ప్రతీచీ దిగంగన ల్పాడఁ గలరు
నిత్య జయమంగళము నీకు నిఖిల భువన
జన శివంకరమూర్తి కైశ్వర్యనిధికి !!!

—

## నిరాశ

ప్రభువర్గ్గమై మండిపడి పైనఁ బడుచుండఁ
జల్లఁగా నవ్వి శీర్షములనిచ్చి
అధికారలక్ష్మి అన్యాధీన యగుచుండ
తడిగాని కనుదోయి వెడలనిచ్చి
సాహిత్రీవనిత నిస్సారమై పడియుండ
గీర్వాణవీణ మ్రోగించి పాడి
వంశదేవి యశోధ్వజ మూఁగిపడుచుండ
నుద్ధరణోత్కంఠ ఊఁత నిలిచి

కాల రాజ్యాంగచక్ర వక్రగతులాప
సాత్త్విక నిరోధబలములో శాంతిసమర
ఘోరరంగములో నగ్నికుండములను
లీలఁ బ్రాణాహుతుల నీయలేదె నేను ?

నా తొలిబాములెన్ని గనిసం గల కాలము కష్టనిష్ఠురో
క్త్వతలిఁ బ్రాఁకులాట గనుపించుటెకాని స్వతంత్రతా కళో
పేత విమాన యానముల విశ్వవిహారము సేఁతలేదె ; నా
కీ తఱినైన సుంత యిఁక నీప్సితసిద్ధికిఁ దెన్నులున్నవా ?

జగతీ పురాపుణ్య సర్వస్వ ఫలమైన
బ్రహ్మయోగీంద్రుని పాద మేడ
దక్షిణాపథ కళోద్యానమ్ములో నమృ
తము బంచు జక్కన దానమేడ
వాణీపదాంబుజ భ్రమరమై మధుర రా
గములు నింపిన రుద్రు కవిత యేడ
అరి పండితుల గుండె లదరి బీఁటలువారు
మార్గసహాయు ధీమహిమ యేడ

శ్రీ విరాడ్విశ్వకర్మ స్మరించు మాత్రఁ
దన్మయతఁ దాండవించు భక్తమణి యేడ
ఎందఱెందఱో విడి చన్న ఈ యెడారి
నెట్టు లేకాకినై పయనించు వాఁడ !

# ఆశ

పిఱికి గుండెల కొక ధైర్య భిక్షపెట్టి
సంఘ నావను నడపు నక్షత్రములను
గ్రమ్ము దే కాలమేఘము! కదలిపొమ్ము;
వెలుఁగు తెన్నులు నాకుఁ గన్పింప నిమ్ము

ఆగమాలయములో అపుడంత మ్రోఁగిన
నా పేరుగంట విన్పడకయున్నె?
సప్తసింధూప్రదేశపుఁ దల్లియొడిలోని
నా కళామూర్తి గానఁబడకున్నె?
బౌద్ధరాజుల కళోపాసనల్ పండించు
నా దివ్యశక్తి తెన్నఁబడకున్నె?
గీర్వాణ రాణ్ణమస్కృతు లంది దీవించు
నా గురుత్వమ్ము ఘూర్ణిగకున్నె?

కీర్తిచంద్రికా వేళలఁ గిన్నరాంగ
నా జనము పాడకుండురే నాయశమ్ము
వైశ్వకర్మణ కరుణాప్రపన్నజీవి.

* * *

---

# ఆ వే ద న

నా బ్రహ్మతేజ మెన్నఁబడు దినాలెల్లఁ
గాల గర్భంబులోఁ గలసి పోయి
నా యార్ష రేఖ లన్యాక్రాంతమునఁ గారు
చిమ్మ చీఁకట్లలోఁ జెరిగి పోయి
నా కర్మశాల లన్యాధీనమయి నీచ
చండాల పాద రజమ్ము మోసి
నా యశోధ్వజము చూర్ణము గాఁగఁ బడి వసుం
ధర గర్భమున విలీన మయి పోయి

మిగిలెఁగా నేఁడు మోసాన మెడకుఁ జుట్ట
మాయ శూద్రత, వైశ్వకర్మణ్య కరుణ
లేనిహీనత, ఉలిపిడుల్ దిబ్బతాల
పాలఁబడు గీఁత, దుఃఖ వృత్తాల చరిత.

మగధరాజ పతాక లెగురలేవేల శి
ల్పివి ప్రాణవాయువుల్ బిగిసె నేమొ
ఆ 'అజంతా' గుహాలందుఁ జీఁకటు లేల
చిత్ర ప్రభారేఖ చెరిగె నేమొ

ఆంధ్ర వీరుల కీర్తులాడ నూనిన వేల
సృష్టి హస్తకళ నశించె నేమొ
ప్రజల యిండ్లకు లచ్చి వచ్చి కూర్చొన దేల
వాస్తుమంగళ శ్రీ పగిలె నేమొ

భరత కువలయ హృదయమ్ము వగవ నేల
స్థపతి చంద్రుల వెలుగు సాంతమని యేమొ
ఈ విచారాగ్ని ఏచి జిహ్వికలు సాచి
నను గ్రసింపగ నిమ్ము క్షణ క్షణమ్ము

నన్ను శంసించు వాణి సన్నగిలిపోవు
చెడు దినాలేవో అపుడు వచ్చినవి గాక
కరము ఝుళిపించి మోహనాక్షరము లెనయు
శిలల వ్రాసిన వ్రాతలు చెఱగ నేల ?

తలపునకు వచ్చి యపుడె ప్రత్యక్షమైన
సిద్ధ సంకల్పులగు నాదు శిల్పి విభులు
ఈ యెడందను బగిలిపోయిన శిలాళి
మోదుచున్నారు దుఃఖము పుట్టునట్లు.

మున్నొకనాడు రాచఱికముల్ వెలిగించిన కొల్వు సీమ లెం
దున్నవో! వాణ్యుపాసన ఫలోదయ రూపములైన కావ్యముల్
మన్నన లంది యున్న యసమాన సభాస్థలు లేవో! అన్నియున్
మన్నయి పోయె నాహృదయ మందిర మందవిజీవచిత్రముల్.

ఏ చరిత్ర విమర్శన హేతువో, త
దీయ దివ్యస్వరూపముల్ నాయెడంద
నిలిపి పోవ నిరంతర స్నేహలతల
మధుర బంధంబులఁ బెనంగి మరఁగినాము.

నా తపస్సులు పండు దినాలు వచ్చి
నా మనశ్చిత్రములకే మహా మహుండో
విగ్రహత్వముఁ గల్పించి విశ్వ పురుష
పూజనీయత దీవించి పోవకున్న ?

ఏరి గౌరవ పీఠ మేట ముంపఁగఁ బ్రజ
బండసమ్మెలు దలపైన వైచె
ఏరి రేకలహాన్ను లెకసక్కెమనుకొన్న
వడ్డెరాజోర కత్తి పైకి దూసె
ఏరి కీరితి పంట కీసు మంటలు రేఁగి
రామన్న మంత్రి ఘోరములు చేసె
ఏరి వంశాగమ శ్రీరమ్యపుటలపై
అమరు లేఖిని కళంకములు వ్రాసె

ఏరి పచ్ఛఁదనమ్ము సహింపలేక
నిమర వోలేదు కులము లెన్నిగొ కలంగి
అయ్యనన్యైక వంశమిద్ద్యది నశింప
లేదు, చలమేదినది లేదు; లేదవజ్ఞ.

ఇది పరాత్పర విశ్వకర్మ దయ వలన
అమృత తత్వము చవి చూచినట్టి బిడ్డ ;
ఇది దిగంగన లందఱి యెదల కెక్కు
మునుపు మురిపెమ్ము తీర్చిన ముద్దుపట్టి ;
ఇది మహోద్ధత వర్ణాల కెదురు తిరిగి
తిరుగు బాటున గాయముల్ తిన్నదిట్ట ;
తిరిగి వెతవెట్టిరా ధర్మదేవి కిన్కఁ
గాలచక్రము వేయి తునుకలయి పోదె !

*　　*　　*

ఈ చిరారబ్ధ నిద్రల నింక ముగించి
లెండు ! లేలెండు ! రాగవల్లీ నికుంజ
రంజితానంత పథ సమారంభుఁ డగుచు
కదలు చున్నాఁడు గమ్యార్థి కర్మసాక్షి !

*　　*　　*

అస్మ దన్వయ చరిత మధ్యస్థపుటలఁ
జదువు గాథలలో దురంశముల నెన్నొ
ఆత్మ లోచనాంచల పథ స్యందమాన
దుఃఖవాఃపూర ధారలఁ దుడిచికొనెద !

# ఆలయ ప్రవేశము

ఆకులఁ బ్రాణమంచుఁ దిన నంటగ నోపని యార్షతత్త్వ మం
దే కని సాకగా బడిన ఈ భరతప్రజ వేడినాడులం
దా కరుణారస మ్మిగిరి యావిరు లాయెనొ కాక ఓర్తురే
ఆకృతి మాత్రులై వనటనార్చెదు వారల నీసడింపఁగన్.

కనులు దెఱవని కందుకే కలుషముండె?
అద్ది వెలిసేయఁ బడుటకే న్యాయముండె?
బ్రహ్మవిద్యా ఫలామృత స్వాదనాభి
లాషు లెల్లరు తమ తలల్ వంచుకొనుఁడు!

విశ్వచిత్రము గీసి కన్పింపరాక
ఆదిమ పరకళాతత్త్వమైన వాని
వాఙ్మనః కాయముల నేరఁబడని వాని
దేవళముఁ జొచ్చియైన నుతింపనీరె?

విరిగి కూలిన గోడ పెనుతాపాడులమిట్ట
చివికిన మతము వచింపకున్నె?
అటఁ గంబమున ఱెక్కలార్చు ఖగస్వామి
ప్రేమ దృక్కుల నాదరింపకున్నె?

అకలంక తైర్థికు లడుగు వెట్టిన పున్నె
ములమెట్టులుండగా నిలువకున్నె ?
స్థిరఘంటికాకృతచ్ఛిన్న నిస్వనవాణి
విజయమ్ము కలుగ దీవింపకున్నె ?
అచల సత్యాధ్వగమనవ్రతైక నిష్ఠ
నడుగు వెట్టిన హరిజనోద్యమము బలము
పెరిగి సేతుశైలములు వ్యాపింపకున్నె ?
మా మహానందరాశి యుమ్మలికఁ గలఁగి.

ఎండిన మోములో నొదిగి ఏపరతేజము పైకిఁ గానరా
కుండె నదే పునగ ప్రసరణోద్యమ మూనిన దింక నాప నె
వ్వండు ? చరిత్రవాణి వినవచ్చి మహాత్ముని పిల్పు లోకముల్
నిండి ప్రతిధ్వనించి విదళించెనుపో యుగమాఢ్య మాంద్యముల్.

విద్యల నహంకరించిన విష దినాల
దేవునకు మాలలకు అడ్డు తెరలు దింపి
యుగములైనది జీర్ణించి యున్నవానిఁ
జించివేయఁగవలె నాలసించనేల ?

ఈ హృదయాగ్నికీల శమియింపదురా గయికొన్ననూత్న శాం
త్యాహవ దీక్ష ఆగదుర ఆఁకలి దప్పుల డస్సి దేహ మి
ట్లే హరియించి పోని తలయెత్తదురా సుఖజీవనాశ ఈ
శ్రీహరి కోవెలన్ దలుపుతెక్కల మూతలు విచ్చునంతకున్.

---

# పి తృ లో క ము

శీల బలమున జీవన క్షేత్రమందు
శ్రీహరి ధ్యాన హాలధారఁ జేసినట్టి
పరమకృషి యెల్లఁ బండెనో పర్వవేళఁ
బిలుచుకొనిపోయె నిను మహావిష్ణువాణి.

కుతుకమునఁ జేరి మమ్ము మూర్కొనెడు వేళ
నెన్ని యశ్రులఁ దడిపితో ఈ శిరములఁ
దొణికిన కణమ్ము లమృత బిందువులో యేమొ !
వింత వింతల మేళ్ళుదయించె మాకు .

నీ యుదార భిషఙ్నిపుణో మహస్సు
పేద యెదలఁ గృతజ్ఞతఁ బెట్టిపోయెఁ :
గలిమికయి గాక గౌరవ మలఁతిగాక
ధర్మ ధన్వంతరివి యాచుఁ దనరినావు !

జీవనపు బాట సగమేనిఁ జేరనపుడె
మృత్యు భయదాంకమున విశ్రమించెఁ దనువు !
జన్మ సోపానముల నెక్కి సాగిపోవు
నిత్యమగు నాత్మ కేమి హానియగు దీన ?

ఆపె కోటీశ్వరార్థాంగి అమృతరాగ
వతి ప్రజావతి ఈశ్వరవ్రత పునీత
†పార్వతీ, సర్వమంగళావహాను జూచి
నా ప్రణతిపూజ చెప్పి యానంద పడుము.

పసిఁడి తామరచెండ్లతో బంతు లాడి
యాడి, చదలేటిదరుల వాహ్యాళి యంచు
చిన్ని చిన్నారి నడలతో *'సీత, భద్ర
మాదు' లేగెద రదుఁగో ముద్దాడి చనుమ.

దివిజతటినీ పయస్సులు చవులు చూచి
పుణ్యముల విందు లారగింపుము కరమ్ము
దైవికానందమయ భవధారి వగుము
విశ్వకృన్మంగళాశీస్సువృష్టి యదిగో!

ఐహికము రోసి యాముష్మికార్థి వగుచు
దివికి నడచిన నీ పదద్వికము కివిగో!
మా నమస్సులు జన్మ జన్మముల దాక
సరసగుణతోషి! ‡నాగభూషణ మనీషి!



† మేనత్త పార్వతమ్మ. * తోఁబుట్టువులు. ‡ భావసం. వైకుంఠైకాదశీనాఁడు స్వర్గస్థులైన నా పితృపాదులు.

# సంవత్సరాది

అమృత రూపిణి ప్రత్యుషస్సమయ రమణి
కెంత రాగము కలదొకో ఈ వసంగ
అనుదినము వచ్చి శాంతి సౌహార్ద భరిత
భావ గీతాలపనచేసి పోవుచుండు.

నూత్నహాయన భవన మనోజ్ఞసీమ
నెన్ని చిత్రము లున్నవో యెఱుఁగఁ దలఁతె
చైత్రమాస కవాట పక్షములు దెఱచి
అడుగు పెట్టుము లోన నాహ్లాద మెసఁగ.

వార వారము నవచిత్ర వైభవముగ
ఈ కళారాధనమ్ము లింకేరి తరము ?
నీవు గల యిండ్ల నొక శోభ నిండి పోవు;
నీవు తిరుగాడునాఁడు పునీత మగును.

తెనుఁగు నేలన్ నవ్య తేజము ల్విరియఁగా
శ్రీరంగవల్లి రచింపు మమ్మ !
తెనుఁగు గీముల రమాదేవి క్రీడింపఁగాఁ
గల్యాణ తోరణాల్ గట్టు మమ్మ !
తెనుఁగుఁ జేతుల కళా ధన రేఖ తెలియఁగా
వెలలేని బొమ్మలు పెట్టు మమ్మ !
తెనుఁగుఁ గాఁపులతీపి తీరులు మేలుగా
వెలలేని ఫలము లర్పించు మమ్మ !

తెలుఁగు కబ్బాల పూల పూజలను సలిపి
వెలుఁగు జోతుల నెత్తి చూపింపు మమ్మ !
తెనుఁగు దేవికి మంగళ మనఁ గదమ్మ !
నవ్య సంవత్సరాది నానంద వేళ .

'నిరుడు' చెలికత్తియలఁ గూడి తిరుగుచుంటి
వప్పుడే మందగమనము లబ్బె నేమి ?
రిత్త చూపులు నిలిపి చరించు నీవు
భావ భరితంబుగాఁ దల వాల్తువేమి ?

"నూత్న సంవత్సరాది నీ నోముపంట
నీ మధురమూర్తి ......" కాలివ్రేల్ నేలవ్రాయ
హృదయ శతపత్ర పాత్రలో నింతలోనె
ప్రేమ మధుపూరములు వెల్లివిరిసినవియ ?

ఇట్టి లజ్జావ కుంఠన లేమిచేయు
హృదయ మధురాభిలాష గ్రహించినాఁడ
నాల్గు పురుషార్థముల మహానందరసముఁ
బంచగల కేలుఁదమ్మి పై వ్రాలవలెనె ?

పారిజాత పరిమళ ప్రచుర తనుఁడు
కామఫలదాన కల్ప సంకల్ప బలుఁడు
నవ వసంతుఁడు పూర్వపుణ్యా ఫలశీలుఁ
డడుగో ! యౌవన నందనోద్యానమూర్తి !

---

# ఏ క వే ణి

పవన డోలాయితములైన పర్ణతలము
లను దలలు వాల్చి విరులెల్లఁ గునుకుఁ జెందె ;
ప్రకృతి శాంతిని మున్గె ; నీరవ నిశీథ
మేన యొక్కర్తె కను రెప్ప లెత్తియుంటి .

వెన్నెలలు పుక్కిలించి స్వర్వీథులందుఁ
దుంపురులు జిమ్ముచున్న దేదో చకోరి ;
అండజమ్ముల కమృతంబు పిండువాఁడు
చిగురుఁబోఁడుల విరహాగ్నిఁ జెనక నేల ?

ఆ కళానిధియైన యాహ్లాదకరుఁడు
వచ్చినాఁడని యెంతో సంబరముతోడఁ
జదల పాన్పున మల్లెలు చల్లుచున్న
యీ నిశాకామినీ శ్రమ నిచ్చగింతు .

మధుప వల్లభులం దమ మందిరములఁ
బవ్వళింపఁగఁ జేసి శర్వరులు ద్రోయు
పద్మినీ లలామలకు నీ ప్రణయ నిష్ఠ
సేకురుట యే పురా సువిశేష వార !

మనసు మఱపించి మురిపించి మసృణ గండ
తలములం దాఁగి యున్న ముద్దులు హరించి
అధర రస సంపదలను జౌర్య మొనరించి
యల్ల నల్లనఁ బ్రియుఁడు మాయమయి రాఁడు.

దిగ్వలయ చక్రమట్టు లందికొన రాక
ప్రతిరవము వోలె దూర దూరముగఁ జనుచు
ఏకవేణిక ని ట్లలయింప నేల?
ఈ శిరీష శరీర సహింపలేదు.

కళకళలాడు సౌరుల నిగారములం దగు మూవులం గవుం
గిళులఁ బెనంగివైచి గిలిగింతలు పెట్టెడు సన్నజాజి తీ.
వెలఁబడు పూలవానలకు వేఁడుక లందుచుఁ బ్రేమపాయసం
బులనుభుజించునాఁటితలఁపుల్ వలపుల్ మొలిపించుటాలకున్.

*త్వష్ట్ర కల్పిత మీ స్నేహ పాత్రలోని
మర్మశిల్ప మదేమొ ప్రేమరసమూరె;
రమ్ము నవమన్మథాకార! రాఁగదోయి!
ఈ తనూవల్లి కాలంబ మీయ వోయి!

కంకణ క్వణ ములను శృంగారగీతు
లను వినంగల వింక నాలస్యమేల?

---

* "త్వష్టా జాయామజనయ త్త్వష్టాఽస్యైత్వాం పతిం..." త్వష్ట వధూవర నిర్మాత యైనట్లు యజుర్వేదము.

# ఆర్ద్రాక్షతలు

సామ గానోర్మికల నూఁగి సతుల మేలి
చూడ్కి ముత్యాలమున్గి యస్తోక మైన
పసుపుఁ బారాణి పూఁతల వన్నెమీఱు
దంపతులు మీరు ధన్యవృత్తములు మీవి.

ఒక పురా పుణ్య బీజమేదో యవేద్య
కాలభూగర్భపుష్టి మొలకయయి సాఁగి
వచ్చి సాప్తపదీ స్నేహవల్లి యగుచు
మిమ్ముఁ బెనవైచె నర్మిలి మెలికలందు.

విశ్వభారతి చనుఁబాలఁ బెఱిగి తీవు
జ్ఞాన ధాత్రి కన్నట్టి సౌగంధి వీవు
మీ సుదాంపత్య మొక కళామేళన మను
ఈ రసజ్ఞుని యూహ ఫలింపనిండు.

సరస ఫలహారి సంసార శాఖి నీడఁ
గూడినారలు; వలపుల గూటిలోన
వ్రాలినారలు; చిలుక గోరంకలట్టు
లాత్మ తుష్టిగఁ గిలకిల లాడుకొనుఁడు.

విడని బిగువులు మీ 'బ్రహ్మ ముడుల' లోనఁ
గలవు ధర్మార్థ కామ మోక్షముల మణులు;
ఒకఁడె యనర్ఘమే! యిన్ని యున్న మీకు
ఎంత యైశ్వర్య మగునో యూహించుకొనుఁడు.

భర్తృరూప మఖండ దైవకళ నీకు ;
రమణి నామము నిగమ మంత్రమ్మె నీకు ;
ప్రతి మిథ స్స్వర్శయును దివ్యరాగ రసముఁ
దోఁచుకొఁ గావుత యువగృహస్థులగు మీకు.

మగని యడుగుల కేదివ్య మహిమ గలదొ
కలికిమొద నే పరంజ్యోతి వెలుఁగు గలదొ
నెమకి దర్శింపఁ గడఁగుఁ డన్నింటిలోన
అమృత మధురములైన బంధములు మీవి.

కాణ్వ సహకార శాఖా ప్రకాండ మీవు ;
సురభి సుమనో రుచిర వన జ్యోత్స్న వీవు ;
ఈవు పౌన్నవు, విరజాజి వీవ, యింక
ఈ గృహస్థాశ్రమమున మీ రెంతశోభ !

*'జ్ఞాన' తారాపథంబు *'విజ్ఞాన' వసుధ
కలసి ముద్దాడుకొనెడి దిక్చక్రరేఖ
వెలుఁగు ‡సానగ గణము దీవించుఁ గాక
ఆయురారోగ్యభాగ్య నిత్యానుభవము.

---

* మోక్షేధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్ప శాస్త్రయోః. అమరము.

‡సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సువర్ణ ఋషులు యజుర్వేదములో "ప్రాచీ దిశాది" మంత్రములలోఁ గన్పడుచున్నారు. వీరు వేదాధిపులై దిక్చక్రముల పాలకు లైనట్లు ప్రమాణములు కలవు.

# కర్మయోగి

ప్రాఙ్ముఖంబున సితప్రభల చారలు వోలె
భసితరేఖలను ముప్వారుసఁ బూసి
అరుణార్క బింబాంశ మవతరించిన రీతి
కుదురు కుంకుమ బొట్టు నుదుటఁ బెట్టి
ప్రత్యూషః కలరావ ఘణితి నానాసాధ
నమ్ములు గలుగల్లునం గదల్చి
జాగృతజీవ ప్రచండ దీక్షాజ్వాల
వలె బృహద్భానునిఁ బ్రజ్వలించి

విశ్వఘటనా విభూతు లావృత్తి నెఱపు
కాల శిల్పికిఁ బ్రతిబింబ కల్పుఁ డగుచు
భక్త నామముతోఁ బ్రజావాణి నిలుచు,
అంగవస్త్రము గట్టు, ఈయన యెవండు ?

న్యగ్రోధ విటపి చాయల సందులం దన
తను వాతపగ్లానిఁ గనలి పోవ
ఎదుటి కుండమున వహ్నిజ్వాలికా జిహ్వా
స్విన్నాంగకముల నేచి నడయాడ
ఇనుప ముద్దలఁ బ్రజాహిత రేఖలను దిద్దు
వజ్ర హస్తములు బొబ్బలయి పోవ
'దాఁగలిం' బటు సముద్భట ఘట్టన క్రియా
శ్లథితమై వక్షోబలమ్ము జాఱ

ప్రాకృత వికారములకు ద్వంద్వముల కొగ్గ
కాత్మవిధి బద్ధుఁడై కర్మ యజ్ఞచణ స
మాహిత స్వాంతుఁడై జగన్మంగళార్థ
రాగరాశియై ఏ స్థిత ప్రజ్ఞుఁ డితఁడు ?

భారతక్షేత్ర సౌభాగ్య రేఖలు గీయ
నాఁగలి కఱ్ఱు శాణశిల నూరి
సస్యలక్ష్మీ మహోత్సవ నవ్య భవ్య వే
ళా స్యందనములు బండ్లను సృజించి
పల్లెటూళ్ళుల కుటీప్రాణి కాయువు పట్లు
మేలి రాట్నములు నిర్మించి యిచ్చి
ఐహికంబునకు నిత్యాముష్మిక విభూతి
దేవతామూర్తిఁ బ్రతిష్ఠ చేసి

ఎల్ల యిలను మాంగల్యా చిహ్నిత నొనర్చి
లోక ధిక్కృతి ఫలములో లుప్తకీర్తిఁ
జివికి యటనట మిగిలి శుషిం
చి యున్న
స్థపతి చంద్రుఁడవా ! నమస్కారమయ్య !

జీవనంబునఁ గళను దర్శింపఁ గఱపి
ఎన్నఁడాచార్య పదము వహించి నావో !
శిల్ప దేవ్యార్ద్రి చరణ రాజీవ రేఖ
లద్దు కొన్నాఁడ వెపుడో భక్తావతంస !

శివమో ! సుందరమో ! ప్రశాంతమొ ! కళా
శ్రీ దొంకు నీ తోంటి మూ
ర్తి విలోకించి యుగమ్ము లాయె ; స్మృతి వీ
థిఁ మాయమై పోయె నీ
భువ నోషశ్శుభ వేళ ఫుల్లనయనాం
భోజాళికిఁ దర్శనో
త్సవముం జేయుచుఁ గేలినెత్తి యిడ రా
దా ! స్వస్తి వాగక్షతల్ .

---

# ప్ర బో ధ ము

హిమాలయమ్ముల చఱియ లొరయుచు
నిఱుకు కనుమలఁ బొంగి పొరలిన
ఆర్యనిర్ఝరిణీ పరంపర
కగ్రవీచివిరా !
చరితకు
అందితివి నేఁడు !

రాగవల్లీ కుంజ పుంజ వి
రాజితమ్మగు గగన పథమునఁ
గదలి వచ్చెడి కర్మసాక్షికి
స్వాగతం బీరా !
శిల్పీ !
సత్త్వముం గనరా !

ప్రత్యూష స్సమయంబు నందే
ప్రణవనాదోపాసనంబున
అలరుచున్నది పికతపస్విని

ఆకుటీరములన్
శిల్పీ !
అరసి యున్నావా !

కలఁతదేరిన తమ్మిపడఁతుల
కులుకుఁ జూడ్కుల కలికితనమునఁ
జిందిపాఱే రసతరంగ
శ్రీలఁ జూచితివా !
అవ్వలి
చెరువుతల్లి యెదన్ . .

తారకలలోఁ దళుకుఁదనములు!
నీరములలో నిగ్గుఁదనములు !
సకలసీమల సొబగుసిరియే
చక్కఁగా నిల్చెన్
శిల్పీ !
చాటు నీప్రభలన్ .

విశ్వమంతా నీగృహంబే
ప్రజసమస్తము నీజనంబే
విశ్వసేవన ధర్మపాలన
విధిఁ జరింపుమురా !
శిల్పీ !
విస్మరింపకురా !

ప్రకృతి దివ్యకళాకటాక్షము
నీవు నవ్యకళా నిధానము
ప్రకృతి నీవును బరమదైవ
ప్రకృతి జనితులురా !
శిల్పీ !
పావనాంశులురా !

పూతవైదిక భావలహరీ
స్నాత మంగళమూర్తి వౌచును
గర్మశాలం గర్మయోగివి
గాఁ జరింపుమురా !
శిల్పీ !
కళలు జిమ్ముమురా !

సానగాదుల వాణి వెలసిన
సరణి యనుసరణీయ మైనది
ఔపనిషద శ్రీపయస్సుల
కాలవాలమురా
శిల్పీ !
ఆత్మ శాంతిలురా !

బ్రహ్మతేజస్సులనుఁ జిమ్మచు
పదును శాయని ఉలుల యంచుల
భాగ్య భారత మాతృ మూర్తిని

వ్రాయరా శిల్పీ !
మాహాత్మ్య
ఫలకముల నేఁడు.

ఈ కళా సామ్రాజ్యపీఠము
నేలుకొందువు యుగయుగమ్ములు
విశ్వకర్మ పరాత్పరాంఘ్రులు
విడువఁ బోకుమురా
శిల్పీ !
విలయ మయ్యెడురా !

మేలుకొనరా పుణ్యమూర్తి !
మేలుకొనరా పూతశక్తీ !
మేలుకొని నిష్కామసేవా
మృతము నానుమురా !
శిల్పీ !
మేళు లయ్యెడిరా !

—

# మ క్కు వ ని క్క మే ని ?

ఈ విశాల వసుంధర నెల్లయెడలఁ
బెళ్లఁ బెళ్లను విఱిచి చూపింపఁగలను
నా కళాదేవి చరణ చిహ్నములు కొన్ని ;
నా ప్రశంసన ఫలక వర్ణములు కొన్ని !

కాలదండాగ్ర విలయ విఘాతములకు
వ్రయ్యలై పోయి చూర్ణచూర్ణమ్ములైన
నా మహాచార్యమణుల రత్నాలపీఠు
లెట్టి సంజీవినులఁ బునస్సృష్టి యగునో !

బ్రాహ్మ శైల్పిక సూత్రసారముల నాని
జ్ఞాన విజ్ఞానములు పండు "ఖాండవములు"
మయ రసాయన శాలలు మంటలంటి
సమసె నిఁకఁ బునర్జీవన సమయమెపుడో !

ఆ "విమానాధికరణా" ద్యనర్ఘశాస్త్ర
ములను లేగులాబీల గుత్తులును నలిగి
శిల్పదేవ్యాలయ ద్వారసీమ ముందు
ఇంత పల్లేరు పెరిగెఁ దీయింపలేరో !

శిల్ప మన నోరులూర శంసించువార
లీ యుదగ్ర దారిద్ర్య వహ్ని శిఖలందు
కుములుచుఁ గృశించుచును బూది కుప్పయైన
శిల్పిఁగని జాలిఁ గన్నీరుఁ జిందరొక్కొ !

ఊలుల యంచుల ఆస్తిక్య ముద్ధరించి
'శ్రావణా'గ్రములం గళాశ్మములు మెఱపు
గొలిపి శ్రుతిశిల్ప సూత్రముల్ గలయఁ జేని
నిదురిలిన వీని మేలుకొల్పుదురా లేదా !

కర్మశాలాహిరణ్యంబు కావ్యశాస్త్ర
వాసనలు చిమ్మ నప్రతిష్ఠా తమస్సుఁ
జీల్పఁ జొచ్చెడు నరుణ రోచిస్సులందుఁ
గట్టుకొనరె సేవావ్రత కంకణములు !

ఒక యెడ నవనవోన్మేష వికచ కుసుమ
మాధురీ శ్రీల కలల మై మఱచినారొ !
పాదులోఁ దడియారె ; తీవతల వ్రాలె
నీరు పట్టుఁడు ; మఱువ నిక్క మేని ?

—

# భిక్షాపాత్ర

సనాతనార్యసంఘ వాహిని కగ్రవీచియై, వేదయుగమునుండి నేటివఱకును వ్యాపించిన నాగరికతకు హేతువై, భారతదేశమున మూలమూలల శిల్పకళాతోరణములను వ్రేలఁగట్టి, కాలవశమునను, అన్యుల దుర్మంత్రముల చేతను రూపేది శుష్కజీవనుఁడైన శిల్పిచంద్రుని భిక్షాపాత్ర మిందు కథావస్తువైనది.

ఇయ్యవి మావికొమ్మలు గదే అనుకంప వహించి నీడలం
దుయ్యెల లూపుచున్ బిక గళోక్తుల నల్లనఁ బల్కరించుచున్
నెయ్యముఁజూపి గాచు నితనిం, గళలూరెడు మోము కందిపోఁ
గుయ్యిడుచున్నవాఁడు, కనుఁగ్రుడ్డులఁ బ్రాణము లేమి నిల్చునో.

ఈ పసిపాప కెవ్వమని యేడ్చిననే యెద జల్దరించెడుం
బాపము! కన్న యాల్మగలు భగ్నమటంచు నిఁకే నితాంతసం
తాప హుతాశనచ్ఛటల దగ్ధము లైరొకొ! ఏ వ్యథాకుటిన్
గాపురముండి కండలు సగంబయి పుట్టిన బిడ్డఁ బాసిరో.

ఏకాంతముగ డించి యేఁగిరేలొకొ గోన
ప్రేలిక యుయ్యాల వ్రేలఁ దీసి
మిడిమిడి యెండచేఁ దడి యాఱఁ దాఁ గొంతు
చన్గుడిపించి యేఁ జనిరొ లేదొ

ఎంత సేపటినుండి యీ కూన కడుపులో
ఆఁకలిమంట బిట్టలము కొనెనో
నేవళంబైన మైదీవ గాడ్పుల కమ్మి
వేసుకో మనసెంత విఱుచు కొనిరో

తల్లిదండ్రులో కారో ఏ దారుణాసు
రప్రవృత్తి విజృంభించి రగులుచుండెఁ
గలియుగంబున నెల నిసుంగులకుఁ గూడ
ఇంత గుజ్జనగూడు లభింపనీక .

ఇవిగో కాల్నడజాడ లీ పథము నందే చూచుచుం బోదు; నిం
ద విలోకింప విషాదగర్భ మితివృత్తం బేదో గన్పించు : న
త్రై విధీ! హా విధి! ఎవ్వరీ భయద దారిద్ర్యాగ్నికీలాహుతుల్
శవభూతుల్ తలిదండ్రు లిందుఁబడి పంచత్వంబునుం బొందిరో!

కొలమేదో, మెడమీఁద జన్నిదపుఁ బోగుల్ చిన్గివ్రేలాడు; స్వ
స్థలమేదో, ఇట వీరి జీవనములన్ సంధ్యా తమిస్రంపుఁ జా
యలు గ్రమ్మెన్; వదన స్వతంత్రకళ, వ్యక్తావ్యక్తమై యే కులీ
నుల వంశంబునో చాటుచున్నది: నిరన్నుల్ వీర లెవ్వారలో!

వ్రేవులు మాడి వ్రందు పెనువేదన లోఁ గడచూడ్కిలో నిరా
శావరణంబు నందు సచరాచర విశ్వము గిఱ్ఱు గిఱ్ఱు నె
న్నో వలయంబులం దిరుగుచుండి తటాలున సర్వశూన్యమై
పోవఁగ నెంతగాఁ బగిలిపోవు నెదల్ యమరజ్జు కౢప్తముల్.

ఎమ్ములగూటిలో ఉసురు లించుక యించుక నిల్చి ఇంత కా
లమ్ము వెలింగె మైచెమటలం జమురోడ్చినఁ గాలువచ్చి క
ష్టమ్ముల దారులన్ నడక సాఁగియు సాఁగక నేఁటి కీ శ్మశా
నమ్మున సొమ్మసిల్లి పడినారు నిరర్థత నిస్సహాయతన్ !

కాలపురుషుఁ డకారణాగ్రహము పూని
సిలుగు రాళులు రువ్వి హింసించు నెడల
నరులకు శ్మశానభూమి ఆనందశయ్య !
కాలపాశము చిరసుఖగ్రంథి చూవె !

కష్టకబళము లివిగొ మ్రింగమని యిచ్చి
బహుళ చింతారసమ్ము ద్రావంగఁ బట్టి
మృత్యు ముఖమై గుటుకు్కన మ్రింగె నిదిగొ !
ఇట్టివింక భిక్షాపాత్ర లెన్ని గలవొ !

"విశ్వకర్మా దిశాంపతి ర్విశ్వహోత"
అన్న యక్కరములు గల వజ్రెగి దీన
ఏ కళాజ్యోత్స్న లీనెనో యితని చేయి
ఏ మహాశిల్పిమణి మట్టిగా మఱఁగెనొ !

ఆదివిరాణ్ముఖావళుల నైదుగురైన మహర్షు లా పురా
వైదికవేళలన్ భువనపావన యాజ్ఞిక శైల్పిక క్రియా
భేదము చాటి పంచవిధ వృత్తుల లోన నివృత్తి సౌఖ్య సం
పాదన మంది రా ఘనుల వంశములన్ జనియించినారటో !

ఇతిహాసంబులు పూలసేసలిడె నోయీ! బౌద్ధరాజన్య సం
తతు లానందము కందళించెడు 'అజంతాచిత్ర' నీరాజన
ప్రతతింగూర్చె; నిఁకన్ దురుష్కరణసంరంభమ్ములో స్వార్థభూ
పతి మంత్రాంగములోనఁ బడ్డయవి నీపైనన్ శిలావర్షముల్.

తమ పన్నాగపు సమ్మెత్రాళ్ళ నవరంధ్రంబుల్ బిగింపించి ని
న్ను మహాఘోరములందుఁ ద్రోసి; రదికన్నుల్ లేనిలోకంపుఁ జేఁ
త; మహాద్వేషశిఖాశిఖిచ్ఛటల సందర్భంబు లా క్రూరకా
లములం దెంతగ నల్గిపోయితివో శిల్పస్వామి, యేకాకివై!

హిమవత్పర్వత సానుపంక్తులఁ బ్రవాహీభూతమై భూరివే
గమునం డిగ్గిన 'ఆర్య'సంఘముల నగ్రవ్యాప్తి నింబొంది జ్ఞా
నము విజ్ఞానము మేళవించిన కళాస్నాత స్వరూపంబు నీ
ది మహాత్మా! ఇటుచిక్కియున్ జివికియున్ ద్రెళ్ళెన్ జుగుప్సాస్థితిన్!

బ్రహ్మతేజముఁ బాసి, శిల్పప్రభావ
మస్తమించి, సంఖ్యాబల మాహరించి;
క్రిందు మీఁదైన గౌరవకేతనమ్ము
నిలుపఁ జాలుదె యాత్ముదగ్నిని నశించి?

మీ మొదల కూర్మిమూట నర్మిలిని ద్రోణికి
మావికొమ్మలె పెనుచునో మనసు కరిగి;
ఆ యనాథ కుమారున కాప్తులెవరు?
గొల్లుమని యేడ్చు గళ మూరకున్న దేమి?

అల్లదె కీరచంచు దళితామ్రఫలా మృతబిందుబృంద మ
ల్లలన నాకు లాకులకు నంటి స్రవించుచు సన్నసోనగాఁ
బిల్లని గొంతుక్రోవి తడిపెన్ బికకంఠము లూరడించె; నే
కల్లయుఁ గాదె యిట్టి సహకార మహీజము సార్థకాఖ్యపో !

జీవబంధూక రాగరంజితము నభము ;
పూర్ణిమాహ్లాదకరకాంతిపూర మవని ;
'రాట్నచక్ర' నిస్వనిత మాశ్రమము; దాన
నొక మహాత్ముని భక్తుఁడా యొడిని నిసువు !

* * *

సాంఘిక శరీర విచర దైశ్వర్య రక్త
మెల్లెడ సమముగన్ బ్రవహింపనీక
కరడు గట్టించుకొన్న యంగములు కొన్ని
బాముకొనునేమి ! తుది బదాబదలు కావె ?

* * *

కార్మికుఁడు యంత్రసంబంధి కష్టజీవి ;
వైశ్వకర్మణభక్త ! నీవా ! సమస్త
శాంత కుగ్రామ గృహపరిశ్రమ పరీత
జీవన ప్రాణవాయువౌ శిథిలజీవి !

# ఆకాంక్ష

సమ్మెబండలు కళాస్వామి శీర్షముపైన
    దొరలిన విసపుఁ బ్రొద్దులు గతించె;
శ్రామికాతత కృషివ్రతము దొరగిలంగ
    బుధుల దృక్కుల సానుభూతి యొలికె;
అఖిల భూతలము సస్యశ్యామలముఁ జేయు
    రైతుపై జగతి యార్ద్రమతి యయ్యె;
పెనుచీఁకటుల మునింగిన నిమ్నకుల హృదా
    కాశ మభ్యుదయ రాగములు గ్రక్కె;

కాలఘాతముల కదరి కదలిపోయి
వ్రయ్యలైన పూర్వాంధ్ర సామ్రాజ్యఖండ
ములు పరాధీనములు పృథక్కులిఁకఁ గలిసి
ఒక పతాకము నీడలో నొదుగకున్నె?

రసిసిద్ధుఁడై కవిబ్రహ్మ తీరిచి చన్న
భారత భాగ్యరూపములు పొడమి
శిల్పి తేజము కళాజీవ రేఖలుగ ని
ల్చిన ప్రాక్తనాలయశ్రీలు పొంగి
వీరాత్మ విజయగంభీర శంఖధ్వనిన్
నభము మారోగ్రి దీర్ఘమయిపోయి
అమృతసూత్రములు బ్రహ్మానంద బంధమ్ము
లార్షమంత్రములు మహస్సుచిమ్మ

ఈ మహాంధ్రము మఱల నూహింపరాని
ఏ యశస్సా గడించుట ఈశ్వరేచ్ఛ;
కాలమా పండె; సాహితీఘంటమున నిఁ
కను నవాధ్యాయమునకు శ్రీకారమిడరె!

—